# వయోజనవిద్య

మొదటి పుస్తకము




గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# వయోజన విద్య

## మొదటి పుస్తకము


గ్రంథకర్త

గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎం. ఏ.,

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు

దక్షిణభారత వయోజన విద్యాసంఘోపాధ్యక్షులు



ప్రకాశకులు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

పటమటలంక (వయా) బెజవాడ

# తొలి పలుకు

ఒడికిపోయి చదువుకొనే పిల్లలకోసరము మనవాళ్లు తయారుచేసే మొదటి పుస్తకాలు చాలవరకు వాళ్లు ముందుకు పండితులు కావలె ననే చూపుతో వ్రాయడం జరుగుతున్నది. దాని మేలుకీళ్లు లోపా లోపాలిచ్చట తర్కించడ మక్కరలేదు. నేను కూర్చిన యీ చిన్న పొత్తములో నేనటువంటి పని ఏదీ పెట్టుకోలేదు. బడిలో చదువక చదివినా చదువబ్బక, వ్రాళ్లుకూడ చేయడానికి రాక, తమ బందుగు లకు జాబైనా వ్రాయలేక, లోకపుసంగతులు చదువుకోడానికి వీలు లేక చిక్కులు పడేవారు పిల్లలైనా పెద్దలైనా తెలుగు లిపి నేర్చు కొని లోకములో తలయెత్తుకొని తిరుగునట్లు తయారు చేయడమే యీ నావ్రాతకు కారణము. కాలక్రమాన నిది బడిపిల్లలకు గూడా పనికివస్తుందని నాకు నమ్మికే. కాని యిది కాలక్రమాన జరుగవలసి నది కాబట్టి దాని ప్రశంస యెక్కువ పనిలేదు.

తెలుగువ్రాత చాల సులువు. నిండుసున్నతోను, దానిని తెగగొట్టి యరసున్న చేయడముతోను, వీటిని చిన్నవిగా పెద్దవిగా నొకటొక టిగా నొకటికి రెండుగా చేర్చడముతోను, బొళ్లవేయడము వెలికిల వేయడము కుడికినిలపడ మెడమకు నిలపడము మొదలైన పనులు చేయడముతోను, అడ్డగీత నిలువుగీత వాలుగీతలను అచ్చటచ్చట వాడడముతోను మన యక్షరాలన్నీ గుణింతాలతోనూ వత్తులతోను అంకెలతోనూ తీర్చవచ్చును. వంపులనుబట్టి వీటినన్నిటినీ వర్గాలుగా నేర్పుటచుకొంటే పెద్దవాళ్లకు చాల త్వరగా వీటిమీద గురి నిలవ గలదు. వివరాలన్నీ ముందు పాఠాలలో చూపడమయినది. క్రొత్త యక్షరము నేర్చునప్పుడు ఏ వంపులు ఎట్లు చేరినవో విద్యార్థిచేత చెప్పించితే బాగా జ్ఞాపకముండును.

రెండవసంగతి. తెలుగు వ్రాయడమూ చదవడమూ మొదలుపెట్టడానికి గంపెడక్షరాలు రావలె ననుకోవడము తప్పే. పదమూడుఅక్షరాలు

దీనులమొఱ' యనే పద్యాన్ని వ్రాయనగును. అక్షరాలన్నీ రావలసిన మాట నిజమే కాని కొంతదూరము పనిసాగిపోయి చదువులో రుచి పుట్టడానికి తెలుగులో కొన్నియక్షరాలే చాల యవసరము. అచ్చులలో రెండు—అ, ఆ లు తప్ప తక్కినయచ్చులతో మొదట పనేలేదు. ఇ, ఈ లను మనవారు యి, యీలుగా పలుకుతారు. వ్రాయడమూ వున్నది. ఉ, ఊలను వు, వూ లుగా వ్రాయుదురు. ఎ, ఏ లను యె, యేలే చేయుదురు. ఒ, ఓలు వొ, వోలగును. ఐ, ఔలుఅయి, అవ్లు.

గుణింతాలు నేర్పడములోనూ తలకట్టు, తలకట్టుదీర్ఘము, ఉత్త్వము, ఉత్త్వదీర్ఘము మొదట నేర్పదగినవి. అన్ని నామవాచకాలకూ—డు, ము, వు, లు-అంటే ఉత్త్వాలే వచ్చును. అన్ని క్రియలకు ఉత్త్వవే ప్రధానము. కాబట్టి యీ రెండూవుంటే పదాలు దొర్లించడమూ, వాక్యాలు మార్చడమూ ఆరంభించవచ్చును.

తెలుగుతేటయనే మాట మనకు కొంత గర్వము కలిగించడమున్నది. కారణమింకేమీ లేదు. సాదావ్యవహారమున ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ, (వీనిని మహాప్రాణములందురు) ఙ, ఞ లు మనము ప్రయోగించుట అరుదు. క, గ, చ, జ, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర, ల, ళ, వ, స, శ, హలు మన దినసరికతను నడుపగలవు. కాబట్టి వీటిని మొదట పరిచయముచేసి, తరువాత నెక్కడో గాని రాని కటువుఅక్షరములు నేర్పవచ్చును. ముందుపాఠాలలో నీమార్గమునే యనుసరించడ మయినది.

ఉరుదూ సంపర్కము ఇంగ్లీషు సంపర్కములచేత మన లిపిలోని మహాప్రాణాలకు కొంత విస్తారప్రయోజనము కలుగుచున్నది. ఇంగ్లీషు, అదే రోమనులిపి 'ఎఫ్'కును ఉర్దూలిపి 'ఫే'కును మనము 'ఫ' వాడడ మారంభించినాము. ఉర్దూలోని 'ఖాఫ్' స్థానమున 'ఖ' వాడుచున్నాము. 'థ' కును రోమనులిపిలోని 'టీహెచ్ సంయోగో చ్చారణ ఉండడముచేత కొంత దీనివ్యాప్తియు పెరుగవలసియుండినది.

కాని తెలుగులోనే దీనిని కడుపులోచుక్క లేని 'థ' మ్రింగిపోతున్నది. ఆకారములోను పలుకులోను రెంటను సన్నిహితత్వ ముండడముచేత థ కారమున కిక 'ధ'యే నిలుచునేమో ?

'ఝ' సాధారణముగా తెలుగున రాదు. కావున దీనిని తుదకు వ్రాయుట మంచిది.

మరియొక చిత్రమైన యక్షరమున్నది. అది 'జ్ఞ'-ఈశబ్దము వచ్చుటకు పూర్ణానుస్వార ముపయోగించుట కవకాశము కాదు. కాని ఈ 'జ్ఞ' తెలివికి సంబంధించిన అర్థముగల పదములలో తప్ప మరియెక్కడను నున్నట్లు కానరాదు. అందుచేత దీనినీ తుదిపాఠాలలో చేర్చడ మైనది.

విసర్గ 'ః' కొన్ని సాంస్కృతిక పదములమధ్యన వచ్చును. ఇది లేకున్నను దీనిస్థానమున 'హ'కార ముపయోగించినను పనిజరుగును. నిజమునకు కన్నడము హాకార ( ః ) మిది. దీనిని నిలువబెట్టి విసర్గ చేసిరేమో యన్పించును. కాని ఇప్పటి అచ్చులోను వ్రాతలోను 'ః' తప్పదు. కాబట్టి దీనిస్వరూపము తుదిపాఠాలలో చేర్చడ మయి నది.

తెలుగువ్రాతలో బండి ఱ తఱచు వ్రాయుటకలదు. ఇది యెచ్చట వ్రాయతగును ఎచ్చటవ్రాయరాదు అనేసంగతిలో పండితులే తర్క-వితర్కాలు పడుతున్నారు. జాబితాలు తయారు చేసుకొంటున్నారు. కాబట్టి ఆరంభకులకు, అందులో వ్యవహారానికి అక్షరాలు నేర్చే వారికి ఇది బోధించ బనిలేదు. కాని అచ్చుపుస్తకాలు చదువునప్పు డిది యెదురుపడడం తప్పదు కావున దీనిస్వరూపమును పరిచయ పరచడ మావశ్యము. కడపటి పాఠాలలో దీనిని చేర్చడమయినది.

తెలుగులిపిలోని మరియొక గుర్తు అరసున్న, అరసున్నను కుడిమొగము చేసియుంచిననే మనలిపిలో అరసున్న యందుము. ఇది ఎచ్చటెచ్చట నిలపవలెననే విషయములో పండితులలో తర్క వితర్కాలున్నవి.

బండి 'ఱ' విషయములోనైనా కొంచెము బలువుగా పలకడమనే ఉపయోగముంటే ఉండవచ్చుగాని ఈ యరసున్నవట్టి మూగ. కాని మన అచ్చుపుస్తకాలలో ఇది తప్పదు. దీనినిచూచి చదువరి యిదియేమో యని బెంగపెట్టుకోకుండా ఉండడం కొరకు ఇది కనిపిస్తుందనీ, కాని సాదాపనులకు ఇదిలేనట్లే వ్యవహరించుకోవచ్చుననీ తెల్పడ మవసరము. ఈవిషయంకూడా కడపటిపాఠాలలో చేర్చడ మయినది.

తెలుగువత్తుల విషయమిక్కడ నొకమాట చెప్పదగును. వట్రసుడి, కావత్తు, తావత్తు, నావత్తు, మావత్తు, క్యావడి, క్రావడి, లావత్తు, వావత్తు వీటికి ప్రత్యేకము గుర్తు లున్నవి. అవి క్రమముగా నేర్ప దగును. తక్కిన వత్తులన్నిటికీ అక్షరపు తలకట్టు తీసివేసి మిగిలిన రూపాన్ని ముందటి యక్షరము క్రింద నుంచడమ్ము తప్ప చేయవలసినది లేదు. అందులోని కొన్ని స్వల్పమగు మార్పులు టావత్తిచ్చేటప్పుడు 'ట' మీది నిలువుగీత పెట్టవద్దనీ, పావత్తు ఉత్త్వముతో రావలసివచ్చినప్పుడు ముందక్షరానికి ఉత్త్వము పెట్టక వత్తుప్రక్కన ఉత్త్వముంచమని అప్పటి కప్పుడు నేర్పవచ్చును.

పూర్ణానుస్వారము అక్షరాలు మొదలు పెట్టేటప్పుడే అన్ని యనుస్వారముల తావులోను నిలవ నేర్పడిందనీ యిది తెలుగు పొందిన వరప్రసాదమనీ బోధపరచడ మవసరము. అటువంటి బోధకు తగిన యేర్పాటు ముందుపాఠాలలో చేయడమయినది.

వ్యవహారములో మనకు ఇంగ్లీషు అంకెలు అలవాటయిపోయినవి. కాన వానిని గూడ తెలుగు అంకెలతో పాటు ఈ పాఠములలోనే పరిచయము చేయించడము అవసరము. అంతేకాకుండా పెద్దలైన వాళ్లకు కొంతవరకు లెక్కపద్దు వ్రాసుకోడమూ తెలిసియుండవలసినదే. కాని ఆ పనియంతయు ఈ పుస్తకములోనే తీర్చడానికి రాదు. వ్రాయనూ చదువనూ నేర్చిన తరువాత రెండవ పుస్తకములో విజ్ఞాన విషయములూ లెక్కలు వగైరాలు సిద్ధపరచి యివ్వనగును.

పెద్దలయినవారు మనతో కూర్చొని నేర్చుకొనవలెనంటే వారివారికి దగ్గరిసంబంధముండే పదాలతో వాక్యాలతో మొదలుపెట్టి వారి జీవితానికీ పాఠాలకూ లంకె పెట్టవలెనని చాలమంది ప్రకటించినారు. దీనిలో సత్యమున్నది. ఇది యనుసరింపదగినదే. అట్లే యీ పుస్తకములోనూ అనుసరించడమయినది. కాని అన్నివృత్తులలో నుండే అన్నికులాలవారికీ దర్జాలవారికీ వారివృత్తి, వారికులం, వారిదర్జా మాటలే పొందించవలెనంటే మనిషికొక పుస్తకము అప్పటికప్పుడు వ్రాసుకోవలసినదే. కాని ఇందరికీ సమంగా వ్యవహారములోనుండే సామెతలు, జాతీయాలు, పొడుపుకతలు వగైరాలు చాలాయున్నవి. "వానరాక వరదరాదు" "పిలువని పేరంటమునకు పోరాదు" అనే సామెతల నెదుటపెట్టుకొని నేను ఇందులో పాఠములు మొదలుపెట్టినాను. అయిదక్షరములు నేర్చినవాడు, తలకట్టు దీర్ఘాలీయగలవాడు దీనిని వ్రాయగలడు. చదువగలడు. సులువయిన యక్షరాలతో వ్రాయనగు ఇతరసామెతలు, వాక్యాలు, సుమతిశతక పద్యాలు చేర్చి భాగవత భారతపద్యాల వరకు దీసికొనివెళ్లి క్రమముగా నొక్కొక్కయక్షరముగా కఠినతరమగు నక్షరముల నేర్పుట కేర్పరచినాను. పాఠాలు చెప్పేగురువు అభ్యాసముకొరకు పదాలూ వాక్యాలు చెప్పేటప్పుడు తన యుత్సాహముకొద్దీ తన శిష్యుల యంతస్థుకొద్దీ వారికి తగినపదాలు వాక్యాలు ఇందులో లేకున్నా చేర్చుకొనవచ్చును.

ఇందులోని పదములు కానీ ఇతరపదములు కానీ చెప్పునప్పుడు ఒక్కొక్క పదమును ఆధారము చేసికొని అనేక విషయములను బోధించుటకు వీలుండును. కాబట్టి బోధకుడు పాఠము మొదలుపెట్టుటకు ముందు తాను పరిశ్రమ చేసియుండిననే గొప్ప సంగతులు చెప్పవచ్చును. గ్లోబొకటి, మనదేశ పటమొకటి, తరగతిలో సిద్ధము పెట్టుకొనవలయును. విజ్ఞానమునకు సంబంధించిన ఎన్ని పటములు, బొమ్మలు, సమకూర్చనగునో, వానిని (పత్రికలలోనుంచి కత్తిరింపులైనను సరే) అట్టల కత్తిరించి విద్యాలయావరణములో చేర్చియుంచుట మేలు.

చూడుడు. ఇందులోని రెండవ పాఠములోనే 'మల' యను పద మున్నది. దీనికి కొండయని అర్థము. నల్లమలలని ఎఱ్ఱమలలని, అనై మలలని మన రాష్ట్రమున ఉన్నవి. ఏడుకొండలవాడా అని వెంక టేశ్వరునందుము. అరవములో ఏడుకొండలను ఏళుమలై అందురు.

పటముమీద మలల నెట్లు చూపుదురను సంగతి చెప్పి ఈ మలలను జూపి వీనివిషయము కొంత చెప్పవచ్చును తిరుపతి కొండ్లబొమ్మలు నల్లమలలలోని మహానంది, శ్రీశైలము, అహోబిలము, బొమ్మలు దగ్గఱ నున్న యెడల జూపవచ్చును.

'అల' యను పదమును ఉన్నది. ముద్రపటమున్న యెడల అందులోని అలలను కనుబరచవచ్చును. విజ్ఞానశాస్త్ర ప్రకారము అలలెట్లు పుట్టునో చెప్పి చంద్రసూర్యుల ఆకర్షణ అమావాస్యనాడొకేవైపున నుండుటచే అలలు పెరుగుట ఎట్లుసంభవించునో వివరింపవచ్చును.

ఇందులోని పదములలో వ్యవసాయము, పరిశ్రమలు, విజ్ఞానములకు సంబంధించిన పదము లనేకములు గలవు. బోధకుడు ఉచితరీతిని వాని నుపయోగించుకొని విస్తారమగు విజ్ఞానమును విద్యార్థులకు అందియ్యవచ్చును. ఒకొక్క జ్ఞానార్థియు ఎన్నియో ప్రశ్న లడు గును. వానికి తాను ప్రత్యుత్తర మిచ్చుటకును సిద్ధపడి యుండ వలెను.

మన భాషలోని కొన్ని లిపులఉచ్చారణ పిన్నలు పెద్దలుకూడా అనేక ప్రాంతములలో చాల విపరీతముగా చేయుట కలదు. దంత్య తాలవ్య చ జ లు మొదట గమనింపదగును. పిదప స, శ, ష లెచ్చటెచ్చట పలుకనగునో జాగ్రత్తగా నేర్పవలెను. లేనిచోట వత్తిపల్కడము— భేదమును బేధముచేయడము వగైరా-మాన్పించదగును. "నీ వషః నన్నష శతవృద్ధన్నావష" అని 'ట' ఉండవలసినచోట్ల వైదికులు 'ష' పలుకుదురు. ఇట్టివి తగదని బోధింపవలెను.

నలుబది లేదా నలుబదియయిదు దినముల అభ్యాసముతో, అంటే సెలవులు వగైరాలతో చేర్చి రెండు నెలలలో వ్రాయనూ చదువనూ నేర్పడాని కీపుస్తకములోని యేర్పాట్లు తీర్పడ మయినది. ఇదేదారి, వేరేలేదని గడుసుదనము చేయడము నా మతముగాదు. నేనూ వొక దారి తీసినాను. ఇది బాగా పనికివచ్చునని నా నమ్మకము. పదుగురిదేమాట యాడితే పరిపాటి యవుతుందనేది నా యాశ.

14 ఏ, సుంకువారి వీధి
ట్రిప్లికేను, మదరాసు
12-3-1941

ఇట్లు
గా. హరిసర్వోత్తమరావు,
గ్రంథకర్త.

## గ్రంథాలయ వేదము

వాయువెట్టులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
నట్లె జ్ఞానంబు కూడను నబ్బవలయు
ఉదక మెల్లర కేరీతి నొదవునట్లె
జ్ఞానముం గూడ సేవ్యంబు గాగవలయు
సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యెసగునట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగవలయు.

* *
*

# మొదటిభాగము

## పాఠము ౧

- ◯ పెద్దసున్న
- ○ చిన్నసున్న
- ‿ వెలికిలవేసిన అరసున్న
- ⌒ బోర్లవేసిన అరసున్న
- ( కుడికి నిలిపిన అరసున్న
- ) ఎడమకు నిలిపిన అరసున్న
- — అడ్డగీత
- | నిలువుగీత
- \ / వాలుగీతలు

## పాఠము ౨

దయచేసి తొలిపలుకు చదువుకొని పాఠములు నేర్పడము మొదలుపెట్టండి.

[అకారమునకువచ్చే గుర్తు ✓ (తలకట్టు). కొన్నిటికిది రాదు.]

ం ం ు ు ు

ర ప వ మ ల అ ట

అ ర వ ల

అ ల ర వ

అ ట మ ల

ప ల వ

అభ్యాసము

అటమట అరమర వటవట మలమల

మరవ అరవ మరల వలపట

వలపల పటమట టమటమ

# పాఠము 3

ద క న స

కర పద సలక

కవ పలక కమల

కల పనస వలస

## అభ్యాసము

వరద సరద సవర నవరస

అలసట కదలక వదలక సరసర

## పాఠము ౪

[ఆ యని అకారదీర్ఘానికి వచ్చేగుర్తు —ా]

ు —ా

# ఆ రా పా మా వా లా టా దా

# కా నా సా

ఆద రారా సాన వాటా కాప

ఆస రామా పాట దానా పాక

ఆట పాపా మాల లాలా వాన

నావ కాపలా కసాలా

కామ పావలా కాకర

సాదా మసాలా

అభ్యాసము

రారా రామ రావా పాపా పాపా రారా

రాక రాక ఆటా పాటా

## పాఠము ౫

[ం దీనికి సున్న (పూర్ణానుస్వారము) అని పేరు. ఒక అక్షరానికి తరువాత దీనిని వ్రాసి తరువాత అక్షరము లేకుంటే ఇది మకారంగా పలుకుతుంది. తరువాత మరియొక అక్షరమువస్తే ఇది శబ్దములో మారుతుంది. కాని ఎప్పుడూ ఆశబ్దము ముక్కుతో పలికేశబ్దముగానే ఙ, మ, ఞ, ణ, న లలో ఏదో అవును.]

రం, పం, వం, మం, లం, అం,

టం, దం, కం, నం, సం, ఆం.

నా మ ం   వా ర ం   వ ం క   ద ం ట

వా ల ం   సా ర ం   వ ం ద   వ ం క ర

పా న ం   వ ం ట   క ం ప   ల ం ప ట

అభ్యాసము

మంట   మంద   కంద

పంద   దంప   పంప

లంక   కంపన   మందస

అంటారంట   కంటారంట

వాలం వంకర

## పాఠము ౬

[ఉకారము పలుకవలసివస్తే గుర్తు ు (కొమ్ము) దీనికి దీర్ఘము ూ

ఈ పాఠములో ప, వలకు కొమ్ముఇచ్చేటప్పుడు అక్షరము పక్కన ఇవ్వడములేదని క్రింద ఆరంభించి కుడిపక్కకు తెత్తుమని బోధించదగును.]

ు ూ

రు రూ పు పూ వు వూ ము మూ

లు లూ టు టూ దు దూ కు కూ

ను నూ సు సూ

వారు పూలు కదురు మాలూరు

రూపు రాము దూరము వాటు

పూవు మూర వాలు కాటూరు

కు ల ము    ను ల క    సు ర వ ర ము

కూ ర    నూ లు    సూ ప ము

వానరాక వరదరాదు

## పాఠము ౭

[ఇకారము పలుకవలసివస్తే గుర్తు ి దీనికి దీర్ఘము ీ]

ి ీ

# రి రీ పి పీ వి వీ లి లీ టి టీ మి మీ
# ది దీ కి కీ ని నీ సి సీ

వరి కపి విని కలి నటి మిరప దినము

రీము పీట వీపు లీల టీక మీద దీపము

కిటికి నిలవ సిరి

కీలు నీరు సీమ

అభ్యాసము

దీనులు విసుర రాని కానిపని కిలకిల

కాకి విలవిల మిలమిల రికరిక కరి

మరి దరి దాపు పీక పీల

దీవన విమానము వరినారు నిలవ నీరు

మిరపకారము కవికలము

## పాఠము ౧౦

# ౧ గ ౦ యు

౧, ౧౦, ౧౦౦ : 1, 10, 100

గంగ గిలక గుడి గెల గొడవ గయ

గాలి గీత గూడు గేదె గోము దయామయ

పాయి గయుడు తాయెతు

నాయీడు మాయూరు పోయేవాడు

నాయొడి యోగము

అభ్యాసము

రాగ, పాగ, గార, వంగ, గంప, మీగడ, గరుడుడు, మగువ, పగులు, రగులు, నురుగు, మూగ, గూని, నూగు, లెగు, గెనిమ, గెర, వరిగె, రేగు, నేయి, నెరి, పొగరు, పొగడ, మొగము, గొంగడి, గొడుగు, నాగలు, దొంగ, లోయ, పోలయ, రోగము, గోడ, గోల, గోపిక, గోపాలుడు, సింగము, సెగ, సెలయేరు, సొరకాయ

కూరగాయలు

## పాఠము ౧౧

ణ

గణము మణి కన్నము పాలన్

కంకణము రేణువు విన్నపము లీలన్

వీణావాదన వేణూది

౩, ౩౦, ౩౦౦ : 3, 30, 300

### అభ్యాసము

| | | | |
|---|---|---|---|
| వాణీ | పాణీ | వేణీ | గుణము |
| వణుకు | కోణము | కరణము | కిరణాలు |
| కణుపు | కన్నవారు | కట్నము | లగ్నము |

### వీణా గానము వినుము

కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందు రన్నిదిసలను
కలడు కలండనెడివాడు కలడో లేడో

## పాఠము ౧౨

[ 'చ' అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓలతో చేరినప్పుడు దంత్యముగను ఇతరత్ర తాలవ్యముగను పలుకుట ఉచ్చారణలో చూపలెను. ]

ఐ చ ౨      ౨, ౨౦, ౨౦౦ : 2, 20, 200

చలి    చందమామ    చిలుక
చాలు    ఛాకలి    చీటి
చుంచు    చెరువు    చౌరవ
చూపు    చేట    చోటు

కైపు    వైపు    మైలు    లైటు    గైడు
పైస    రైలు    టైపు    డైరి    చైనా

[ వీటిని కయిపు, వయిపు, మయిలు, లయిటు, గయిడు, పయిస, రయిలు, టయిపు, డయిరి, చయినా అని వ్రాయవచ్చు ననేది గమనికకు తేవలెను. ]

### అభ్యాసము

చిటుక    చుండు    చూలు    చేమ    చేను    చీడ    చీమ
చీదర    చలమ    చావిడి    చీర    చురుకు    చెవుడు    చొంగ
చోడు    పైడి    పైకము    వైగ    వైణికుడు    మైకము    నైలు
దైవము    కంచె    సైను    సైచు

గంగగోవు పాలు గరిటెడైనను చాలు
కంచెయే చేను మేసిన కాపేమి చేయగలడు?

## పాఠము ౧౩

ు త వ — ్మ



| | | | | |
|---|---|---|---|---|
| తల | తిండి | తులము | తెలుగు | తొగట |
| తాను | తీగ | తూము | తేట | తోట |
| కవ్వము | కమ్మ | దివ్వె | రెమ్మ | |

అభ్యాసము

| | | | | |
|---|---|---|---|---|
| లత | కత | తార | తామర | తిలకము |
| తిరుపతి | తీట | తీపి | తులువ | తూగు |
| తెగులు | తెంపు | తెలివి | తేలు | తేమ |
| తొలుత | తోలు | తోపు | కమ్మవారు | నమ్మకము |
| నమ్మరాదు | కన్నమ్మ | చిన్నమ్మ | పొన్నమ్మ | చెన్నమ్మ |

కదురూ కవ్వం కదులుతుంటే కరువు లేనేలేదు

## పాఠము

| | | |
|---|---|---|
| జలగ | జెముడు | సుద్ది |
| జాతి | ముంజేయి | గద్దె |
| జిలకర | జొన్న | మర్దనము |
| జీడిమామిడి | జోగి | |

అభ్యాసము

ముంజేతి కంకణానికి అద్దమెందుకు ?

## పాఠము ౧౫

ప్ర ణ ట క్య
క్రావడి లావత్తు టావత్తు క్యావడి

| | | |
|---|---|---|
| ట్రంకు | అల్లము | పట్టణము |
| క్రావడి | ఆల్లాడు | పట్టా |
| ప్రియము | చిల్లి | చిట్టి |
| ప్రీతి | గల్లీ | కిట్టీ కిట్టక |
| ద్రుమము | అల్లుడు | కట్టుము |
| క్రూరుడు | కల్లూరు | నిట్టూరు |
| త్రెంచుట | మల్లె | పట్టె |
| త్రేపు | జిల్లేడు | పెట్టేవారు |
| ప్రాయి | అల్లా | అయ్యా |
| ప్రోలు | అల్లో నేరేడల్లో | గొయ్యి |
| పుల్లయ్య | దివ్యము | వ్యాపారము |

అభ్యాసము

పిట్ట పట్టు దట్టి మెట్టు గట్టి జెట్టి నల్ల తెల్ల పుల్ల
గొల్ల తల్లి పెండ్లాము కంట్లము త్రాడు మ్రాను

కొండ త్రవ్వి యెలుకను పట్టినట్లు

## పాఠము ౧౬

[ఒ ఓ లు వొవో లుగా వ్రాయడము కలదు. ళ కు ద్విత్వము వచ్చునప్పుడు లావత్తు ఉపయోగించుటకూడ కలదు.]

# ఒ ఓ ౪ ౪౦ ౪౦౦

౪, ౪౦, ౪౦౦ : 4, 40, 400

| | | |
|---|---|---|
| ఒంటె | బలము | మేళము |
| ఒకటి | బాడుగ | వేళాకోళము |
| ఒకడు | బిడియము | కాళి |
| ఒర | బీడు | తాళీసపత్రి |
| ఓర | బురద | తళుకు |
| ఓరిమి | బూర | తాళ్వారు |
| ఓడ | బెల్లము | గొళ్ళెము |
| ఓటి | బేరము | వెళ్ళారు |
| | బొమ్మ | బళ్ళో |
| | బోద | |

అభ్యాసము

కొండ తలక్రింద బెట్టుకొని రాళ్లకు వెతకినట్లు

## పాఠము ౧౭

[పావత్తుకు ఉత్త్వమిచ్చే విధానము గమనించి చెప్పవలెను]

ఎ ఱ ౕ ౢ హా ష

పావత్తు వట్రసుడి కావత్తు తావత్తు

అప్ప అక్కర హారము
టప్పాలు మొక్కట హితము
చప్పిడి యెక్కట హీనుడు
కప్పురము మర్కటము హుళక్కి
పప్పూరు అత్త హెలెను
మొప్పె కత్తి హేమము
ముప్పొద్దు సత్తు హొయలు
బృందావనము హరి హోటలు
తృణము

విషము షట్టు కషాయము షావు
మహిషి షికారు బషీరు షీటు
పురుషులు సుషుమ్న షూటింగు షెల్లీ
షేకుస్పియరు షోకు

అభ్యాసము

కర్త, వర్తకము, పుస్తకము, ఉత్తరము

## పాఠము ౧౮

[ఉ, ఊ, ఎ, ఏ, లకు వు, వూ, వె, వే లను వాడుదురు.]

ఒ ఉ  ఊ ం ఎ ఏ

| | | | |
|---|---|---|---|
| ఉముక | ఊరు | ఎవరు | ఏమి |
| ఉలి | ఊట | ఎన్ని | ఏతము |
| ఉవిద | ఊడ | ఎకర | ఏకాకి |
| ఉసురు | ఊచ | ఎనిమిది | ఏడు |

### అభ్యాసము

ఎరువు సొమ్ము బరువు చేటు

పొరుగింటి పుల్లగూర రుచి

ఉన్నమాట అంటే ఉండూరు అచ్చిరాదు

నోరు మంచి దయితే ఊరు మంచిది

దూరపు కొండలు నునుపు

మొరిగే కుక్క కరవదు

ఆయము తెలిసి వ్యయము చేయుము

జీవహింస చేయరాదు

ఆడి తప్పరాదు, పలికి బొంకరాదు

ఉత్తరజూచి యెత్తర గంప

ఊరికంతా వొకదోవ, ఉలిపికట్టె కొకదోవ

## పాఠము ౧౯

[ఇ, ఈ లకు యి, యీ లు వాడుదురు]

౧ ఇ   ౦ ఈ శ

| | | |
|---|---|---|
| ఇది | ఈగ | శబరి |
| ఇల | ఈటె | శాలువ |
| ఇనుము | ఈల | శంకరుడు |
| ఇంగిలీకము | ఈవి | శిలువ |
| ఇరకటము | | శీలము |
| ఇంగిలీషు | | శునకము |
| | | శూలము |
| | | శెక్షను |
| | | శేరి |
| | | శోష |

అభ్యాసము

ఇల్లు ఇరకటం, ఆలు మర్కటం

ఈదాడంటే కోదాడు

ఆకలి రుచి యెరుగదు, నిద్దుర సుగ మెరుగదు

## పాఠము ౨౦

అక్కఱకు రాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు మోహరమున దా
నెక్కిన బారని గుఱ్ఱము
గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ.

టీక. అక్కఱకురాని = వేళకు పనికిరాని, చుట్టము = బంధుగు, మ్రొక్కిన, వరము, ఈని = ఇయ్యని, వేల్పు = దేవుడు, మోహరమున= ఆశతో, తాను, ఎక్కిన, పారని = పరుగెత్తని, గుఱ్ఱము, గ్రక్కున = వెంటనే, విడువంగవలయు, కదరా = కాదా, సుమతీ = మంచిబుద్ధి కలవాడా!

తాత్పర్యము. సమయానికి పనికిరాని చుట్టమును, దండాలు పెట్టుకుంటే వరమివ్వని దేవుణ్ణి, ఆశతో ఎక్కితే పరుగెత్తని గుర్రాన్ని విడిచిపెట్టవలెను.

## పాఠము ౨౧

అడిగిన జీతం బివ్వని

మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటే

మడిగల యెద్దుల గట్టుక

మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ.

టీ. అడిగిన, జీతము, ఇవ్వని, మిడిమేలపు = పొగరుబోతు దొరను, కొల్చి = సేవించి, మిడుకుట = కష్టపడుట, కంటే, వడిగల, ఎద్దుల, కట్టుక, మడి, దున్నుక, బ్రతుకవచ్చు, మహిలో = లోకములో, సుమతీ

తా. కోరిన జీతమివ్వక యేడిపించే యజమాని దగ్గర పనిచేసేదాని కంటే మంచి యెద్దులను కట్టుకొని సేద్యము చేసుకొని బ్రతకడము మేలు.

విశేషాంశములు— ఇందులో వ్యవసాయదారుని జీవితము స్వతంత్ర జీవిత మనడము గమనింప దగినది. జీవితానికి సేవ చేసేవాడు తగిన జీతములేనిది పని చేయడము తగదని కూడ దీనిలో సూచన.

## పాఠము ౨౨

# ఉత్తరుడు – బృహన్నల

కవురవులసేన నుత్తరుడు చూచినాడు. దిగులు పడినాడు. అర్జునునితో ఈ క్రిందిమాటలు చెదరుగుండెతో పలికినాడు:

తే. ఒంటి తలపడి కురుసేన నోర్చువాడ
నే? యిదేటికి వెడమాట లిట్టులాడ
వారు గానక ముందర తేరు దోలు
కొని రయంబున బురి కరగుటయ నీతి.

బృహన్నల (అర్జును డన్నమాట) యేమన్నాడు:

ఇట్లు బెగడొందదగునా? పగవారు ప్రమోదింపరా? మనము పసుల దిగవిడిచి పోయిన పురజనములు మనలం దెగడరా? అది మనకు దీనతగాదా!

తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కబట్టు
మిపుడ కవురవ సయినికు లెల్ల జూచి
వెరగుపడ వేగమును లావు వెరవు మెరయ
గదుపు బెట్టించి పోదము క్రమ్మరంగ.

టీక. ఒంటి = ఒంటరిగా, తలపడి = కలియబడి, వెడమాటలు = పిచ్చిమాటలు, రయంబుగ = త్వరగా, ప్రమోదింపరా = సంతోషింపరా, తెగడరా = అడ్డమయినమాటలూ అనరా, చిత్తవృత్తి = మనసు, వెరగుపడ = అచ్చెరువంద, కదుపు = గోవులమంద.

# పాఠము ౨౩

[ ్ ఇది కకారము మొదలుకల హల్లుల హల్ మాత్ర స్వరూపము తెలుపడానికి తలకట్టు తీసివేసిన పిదప లిపి నెత్తిన అమర్చే గుర్తు. ఒక్క నకారానికి ౝ వస్తుంది. ఒకప్పుడు దానిని కూడ ఇట్లే వ్రాయుదురు.]

క్ – వాక్

గ్ – డాగ్

చ్ – నాచ్

# రెండవ భాగము

## పాఠము ౧

### ఒ ధ

ధ ని కు డు.    ధా న్య ము    అ ధి ప తి

ధి మి త క    ధీ రు డు    వ ధు వు

ధూ ర్తు డు    ధే ను వు    ధో ర ణి

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ.

టీక. ప్రస్తుతము = ఉచితము; అన్యుల = ఇతరుల; ధన్యుడు = తరించినవాడు.

తాత్పర్యము. ఏవేళకే మాట మాట్లాడవలెనో మెత్తగా మాట్లాడి తప్పించుకొని తిరుగువాడే సుఖపడును.

## పాఠము ౨

# ్భ భ

భర్త భార్య అభిప్రాయము భీతి

భువి భూతము భేషు భోరున

అభ్యాసము

భోరునష్టము పొందులాభము

ఉప్పుకప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ.

టీ. పురుషులందు = మనుష్యులలో, పుణ్యపురుషులు = మంచివారు, విశ్వదాభిరామ = లోకమును సంతోషపెట్టేవాడా !

తా. పైచూపుకు ఉప్పూ, కర్పూరమూ రెండూ ఒకేరీతిగా నుండును. రుచిచూడబోయిన సంబంధమే యుండదు. పైచూపు జూచి ఎవ్వరినీ మంచివాడనుకోరాదు. గుణమును చూచి నమ్మవలెను.

## పాఠము 3

# ం ఁ ఫ

ఫలము ఫీజు ఫెలో

ఫాలము ఫుట్బాలు ఫేనము

ఫిలిం ఫూలుస్కేపు ఫోటో

తామసించి చేయదగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమమగును
పచ్చికాయదెచ్చి పడవేయ ఫలమౌనె?
విశ్వదాభిరామ వినురవేమ.

టీ. తామసించి = త్వరపడి (కోపముతో), విషము = వికటించునది, ఫలము = పండు.

తా. కోపమువచ్చిగాని, అడావుడిగా నుండిగాని తొందరపడి యేపనీ చేయరాదు. వేగిరపడితే చెడుపుకలుగును. పండుకావలెనని కోరేవాడు కాయ వట్టి పచ్చిదిగా నున్నప్పుడే తొందరపడి కోసి తేడుగదా! దోరగాయ లయ్యేవరకు ఓపిక పట్టవలెగదా!

## పాఠము ౪

[ ఇందు లిపిస్వరూపమే వేరు ]

# ౦ ఖ

ఖర్జూరము　ఖురాను　ఖడ్గము
ఖాది　ఖూనీ　ఖరము
ఖిల్లా　ఖేరు
ఖీరు　ఖోజా

శ్రీరామచంద్రుడు కుశలవులను చూడగానే యడుగుచున్నాడు.

ఆ. చిన్నియన్నలార శీతాంశు ముఖులార
నళినదళ విశాల నయనులార
మధురభాషలార మహిమీద నెవ్వరు
దల్లి దండ్రి మీకు దండ్రులార.

టీ. చిన్నఅన్నలార, శీతాంశుముఖులార = చంద్రునివంటి మోములు కలవారా! నళినదళ = తామర రేకులవలె, విశాల = వెడలుపగు, నయనులార = కన్నులుగలవారా! మధురభాషలారా = శ్రావ్యమైన గొంతుగలవారా! తండ్రులారా, మహిమీద = భూమిమీద, మీకు తల్లి, తండ్రి, ఎవరు ?

తా. చిన్నకుమారులారా! మీ తలిదండ్రు లెవరు ?

## పాఠము ౫

[ద ధ థ లకుండే సామ్యము భేదముచూపవలెను. ఘ కు రూపమే వేరనడము చెప్పవలెను. వాడుకలో థ ధ యయిపోవు చున్నది.]

ద ధ ంఘ

క థ .. ఘ ను డు

అ తి థి ఘా టు

నా థు డు ఘీం కా ర ము

ఘో ష

అభ్యాసము

పిట్టకొంచెము, కూత ఘనము

క. ఘనశైలంబులు దరువులు
ఘనజవమున బెరికితెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిఁ గట్టిరి
ఘనవాహప్రముఖ దివిజగణము నుతింపఁ.

టీ. కపికులనాథుల్ = కపివంశమందు ప్రముఖులైనవారు, ఘన = గొప్పవైన, శైలంబులుఁ = పర్వతములును, తరువులు = చెట్లును ఘన = మిక్కుటమైన, జవమున = శీఘ్రముచే, పెరికి, తెచ్చి, ఘనవాహ ప్రముఖ దివిజ గణము = (మేఘములు నడుపువాడైన) ఇంద్రుడు మొదలుగాగల దేవతలసమూహము, నుతింపఁ = పొగడు

నట్లు అనగా ప్రశంసించునట్లు, ఘన = మిక్కిలి లోతైన (అనగా గంభీరమై అడ్డకట్ట వేయుటకు సాధారణముగా నలవికాని) జలరాశిః = (నీళ్ల ప్రోవును) సముద్రమును, కట్టిరి.

తా. వానరముఖ్యులు గొప్ప పర్వతములను చెట్లను శీఘ్రగతిని దెచ్చి సముద్రమున వైచి సేతువును గట్టిరి.

కథ. ఇట వానరముఖ్యులను నెడ మొదట పేర్కొనఁదగినవాఁడు దేవతల శిల్పియగు విశ్వకర్మకు బుత్రుఁడగు నలుఁడు. అతఁడు శిల్పిగ, జాంబవంతుఁడు, సుషేణుఁడు, నీలుఁడు ఆంజనేయుఁడు మున్నగాగల వారు సహాయులుగ సేతుబంధము ముగిసె.

## పాఠము ౬

# ఛ ఛ

ఛత్రి　　ఛాయ　　ఛేదించు

ఛలము.　　ఛీఛీ　　ఛోటా

క. ఇలమీద సీత వెదకగ
నలఘుడు రాఘవుడు వనిచె హనుమంతు నతి
చ్ఛలవంతుఁ మతిమంతుఁ
బలవంతుఁ శౌర్యవంతు బ్రాభవవంతుఁ.

టీ. ఇలమీదఁ = భూమిపైని, సీతను, వెదకగ, అతిచ్ఛల వంతుఁ = మిక్కిలి యుపాయముగలవానిని, మతిమంతుఁ = బుద్ధి మంతుని, బలవంతుఁ = బలముగలవానిని, శౌర్యవంతుఁ = వీరుని, ప్రాభవవంతుఁ = ఎల్లరకంటె నెక్కుడైనవానిని, హనుమంతుని, అలఘుడు = గొప్పవాడగు, రాఘవుడు = రాముడు, పనిచెను.

తా. సీతను వెదకు పనికయి శ్రీరాముడు ఉపాయశాలియు, బుద్ధిమంతుడును, బలవంతుడును, శౌర్యవంతుడును, అందరను మించి ప్రకాశింపగలవాడును నగు హనుమంతుని పంపెనని యర్థము.

## పాఠము ౭

# ం ఠ ణ క్ష

| | | | |
|---|---|---|---|
| మఠము | ఠీవి | క్షమ | పక్షులు |
| ఠావు | శఠుడు | క్షామము | క్షేమము |
| కఠినము | ఠేవ | పక్షి | క్షోభ |
| కరకంఠుడు | కఠోరము | క్షీణించుట | |

అర్జునుడు శివునితో పోరాడి గెలిచి శివుడని తెలిసినతరువాత క్షమాపణ కోరుకొనుచున్నాడు.

ఎరుకని ఎరుగక నిన్నుఁ
మరకువ నెదిరించినాడ మరువుము దీనిఁ
కరకంఠా క్షమియింపుము
నెరి నెవ్వం డెరుగగలడు నీ చరితంబుల్.

టీ. ఎరుకని = ఎరుకలవాడని, ఎరుగక = తెలియక, మరకువ = మరపుచేత, కరకంఠా = ఈశ్వరా, నెరి = పూర్తిగా.

తా. తెలియక నీవు ఎరుకలవాడనుకొని నేను ఎదురుపడి పోరినాను. దీనిని నీవు మరచి నన్ను క్షమింపుము. పూర్తిగా నీ చరిత్ర తెలిసికోడానికి నే నెంతటివాడను ?

## పాఠము ౮

| | | |
|---|---|---|
| ఖ ఢ | ౌ | (ఔవు) |
| ఢమ ఢమ | కౌలు | జౌకు |
| ఢాక | గౌను | రౌతు |
| ఢిల్లి | చౌడు | డౌలు |

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు,
కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో నాగరజనులలో,
నొక్కఁడు దనసతి యొప్పకున్న
నొరునింట కాపురంబున్న చంచలురాలి,
బాయంగలేక చేపట్టనేమి
తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే ?
బేల పొమ్మన మాట బిట్టు వలుక
ఆ. నాలకించి మఱియు నామాట చారుల
వలన జగములోన గలుగ దెలిసి
సీత నిద్రవోవ జెప్పక వాల్మీకి,
పర్ణశాల బెట్ట బనిచె రాత్రి.

టీక. రాముండు, వసుధపై = భూమిమీద అనగా ఇచ్చట తన రాజ్యమునందు, పుట్టు, వార్తలు = సమాచారాలు, ఆకర్ణించు కొఱకునై = వినుటకుగాను, నడురేయి = మధ్యరాత్రమున, తిరుగుచో = తిరుగునప్పుడు, నాగర = నగరమునందలి అనగా అయోధ్యా పట్టణమందలి, జనులలో ఒకఁడు, తనసతి = తనభార్య, ఒప్పకున్న = ఛకఁపడకున్న అనగా కుటిలయై యుండుటచేత, "ఒరుని = మరి

యొకని, ఇంటన్, కాపురము, ఉన్న, చంచలు రాలిన్ = చంచల చిత్తము గల భార్యను, పాయంగలేక = (మమతచే) విడువలేక, చేపట్టగ = స్వీకరించుటకు, తాను, వెర్రి, అగు రామధరణీశ్వరుండనే= రామచంద్రుడనా, ఏమి (కాననుట), బేల = ముగ్ధ, పొమ్ము" అను మాట, బిట్టు = కఠినముగ, పలుక, ఆలకించి = విని, మరియు, చారుల వలన = వేగులవారిగుండా, ఆమాట, జగములోన = లోకులలో, కలుగన్ = పుట్టన్ అనగా పుట్టుట, తెలిసి = తెలిసికొని; రాత్రి, సీత, నిద్రపోవ చెప్పక = (ఆమెకు) తెలియబరుపక, వాల్మీకి, పర్ణశాలగ= ఆశ్రమమునందు, (ఆమెను) పెట్టన్, పనిచెను.

తాత్పర్యము—రాముడు రాత్రివేళ మారువేషముతో బయలుదేరి లోకులాడికొనుమాటలు వినుచు పోవుచుండ నయోధ్యలో నొక- రుడు భార్య సుమార్గము లేనిదై యుండుటచేత ఆమెతో "నీవు పరుల పంచల నున్నదానవు. నిన్ను నేను స్వీకరింపను. మమతమై పోరుగు వారియింట నుండిన భార్యను మరల కొనుటకు నేను శ్రీరామ చంద్రుడ ననుకొంటివా? అంతవెర్రిని కాను" అని పరుషోక్తులాడెను. అది విని చారులవలనగూడ లోకు లిట్లు తన్నుగురించి వాడుకొను చున్నారని యెరింగి శ్రీరాముడు సీతాదేవి నిద్రించుచుండ ఆమెకు ఎరుక సేయకయె ఆమెను వాల్మీకాశ్రమమున విడిపించెను.

విశేషాంశములు— ఇందు శ్రీరాముడు స్వయముగ మారువేష ములతో జనులలో గలసి విషయము లరయుట తానరసినవేయైనను గూఢవృత్తిని వినినవి కనినవి అన్నివేళలను స్పష్టములు కావుగావున తనచారులవృత్తాంతమువలన బలపడువరకును వానినిగూడ విశ్వసింప కుండుట సూచితములు. రాజ్యమునం దుత్తమాధికారి యగు రాజే స్వయముగ విషయములు తెలిసికొని తా దెలిసికొనినవిషయముల గూడ ఇతరవిధమగు సాక్ష్యము లేక నమ్మక పరిపాలన యొనర్చిన నంతకంటెను పౌరులకు భాగ్య మున్నే ?

పాఠము ౯

# ౧ ఝ

ఈ యక్షరము సాధారణముగా తెలుగులో రాదు. ఝణం ఝణ, ఝాం కరణ, ఝాం అని అనుకరణములలోనే కలదు.

ఝంప, ఝిల్లీ యని ఇత్యాది పదములు ఏకొద్దిగానో కావ్యాలలో కనుపించును.

ఝళం ఝళ

ఝంఝామారుతము

ఝాంకరణము

౧. దక్షుని జన్నమును ధ్వంసము చేయబోయే వీరభద్రుని కాళ్ళ లోని యందెలు ఝళం ఝళ యని మ్రోసినవట!

౨. ఝంఝామారుతమంటే ఝం, ఝం అని వీచే పెద్దగాలి యన్నమాట.

## పాఠము ౧౦

# ఙ్ఞ

ఆజ్ఞ　　విజ్ఞానము　　జ్ఞేయము

యజ్ఞము　　రసజ్ఞుడు　　జ్ఞప్తి

పుత్రులు పౌత్రులు భ్రాతలు
మిత్రులనరు రాజులాజ్ఞ మిగిలినచోటన్
శత్రులకా తమయలుకకు
పాత్రము సేయుదురు నిజశుభస్థితి పొందన్.

టీ. పుత్రులు = కొడుకులు, పౌత్రులు = మనుమలు, భ్రాతలు = సోదరులు, మిత్రులు = స్నేహితులు, ఆజ్ఞ = ఉత్తరువు, మిగిలిన = చెల్లకపోయిన, శత్రులకా = శత్రువులవలెనే, అలుకకు = కోపమునకు, పాత్రము = గురి, నిజ = తమయొక్క, శుభస్థితి = మేలుగతి, పొందన్ = కొరకు.

తా. రాజులైనవారు తమ ఉత్తరువు జరుపకపోతే కొడుకు, మనుమడు, సోదరుడు, స్నేహితులు అని ఎవ్వరిని దయజూడరు. ఎట్టివారినైనా శిక్షింతురు.

## పాఠము ౧౧

ః దీనిని విసర్గ అంటారు

అంతఃకరణ
ప్రాతఃకాలము
తేజఃపుంజము

ఇట్టిచోట్ల వచ్చును.
హకారముగా పలుకును.

## పాఠము ౧౨

ఱ ఱ

దీనిని బండిరా అంటారు. వ్యాకరణము నేర్చినవారు ఇది యే మాటలలో వచ్చే 'రా' నో మూడుపాళ్లు చెప్పగలుగుతారు. గ్రంథాలలో దీనిని ఇంకా వాడుతున్నారు. గుర్రము అనేది గుఱ్ఱముగా వ్రాయడము సరియంటారు. మన మిదివరలో చదివిన క్రింది పద్యములో ఇది యెక్కడెక్కడ వస్తుందో చూపడమైనది.

దీనిని గుర్తించడము తెలిసికొనవలెను.

ఎఱుకని ఎఱుగక నిన్నుఁ
మఱకువ నెదిరించినాడ మఱవుము దీనిఁ
గఱకంఠా క్షమియింపుము
నెఱి నెవ్వం డెఱుగగలడు నీ చరితంబుల్.

ఁ

ఇది మీ రెరిగియున్న అరసున్నే. దీనిని మన పుస్తకాలలో అనేకచోట్ల వాడడముంది. ఇది ఇప్పుడు పలుకదు. ఇది యెక్కడనైనా చూస్తే యేమోనని జంకవద్దు. ఇది లేదనుకొని చదువుకొనిపొండి.

# పాఠము ౧౩

## అంకెలు

ఇదివరకే తెలుగు ౧ ఇంగ్లీషు 1 (ఒకటి)
తెలుగు ౨ ఇంగ్లీషు 2 (రెండు)
తెలుగు ౩ ఇంగ్లీషు 3 (మూడు)
తెలుగు ౪ ఇంగ్లీషు 4 (నాలుగు)
తెలుగు ౮ ఇంగ్లీషు 8 (ఎనిమిది)
నేర్చుకొంటిరి.

ఇప్పుడు నేర్చుకొనవలసినవి :

తెలుగు ౫ ఇంగ్లీషు 5 (అయిదు)
,, ౬ ,, 6 (ఆరు)
,, ౭ ,, 7 (ఏడు)
,, ౯ ,, 9 (తొమ్మిది)

10, 100; 20, 200; 30, 300; 40, 400; 80, 800
౧౦, ౧౦౦; ౨౦, ౨౦౦; ౩౦, ౩౦౦; ౪౦, ౪౦౦; ౮౦, ౮౦౦
కూడా మీకు తెలుసు.

అట్లే ఇప్పుడు నేర్చుకొన్న అంకెలకుకూడ పదులు, నూర్లు వ్రాయండి.

## పాఠము ౧౪

౧౦కి ౨౦కి మధ్య అంకెలేవి ?

| | | |
|---|---|---|
| ౧౧ | 11 | ఇది నేర్చుకొని |
| ౧౨ | 12 | ౨౦కి ౩౦కి |
| ౧౩ | 13 | ౩౦కి ౪౦కి |
| ౧౪ | 14 | ౪౦కి ౫౦కి |
| ౧౫ | 15 | ౫౦కి ౬౦కి |
| ౧౬ | 16 | ౬౦కి ౭౦కి |
| ౧౭ | 17 | ౭౦కి ౮౦కి |
| ౧౮ | 18 | ౮౦కి ౯౦కి |
| ౧౯ | 19 | ౯౦కి ౧౦౦కి |

మధ్య ఉండే అంకెలు వ్రాయండి.

ఇప్పుడు ౧ నుండి ౧౦౦ వరకు అంకెలు వ్రాసిచూడండి.

## పాఠము ౧౫

### అంకెల స్థానాలు

**౧**

ఒకట్లస్థానము ౧ నుంచి ౯ వరకు ఏదైనా ఉంటుంది.

**౧౦**

పదులస్థానము ౧ ఉంటే పది. ౨ ఉంటే రెండుపదులు ఇరువది. ౩ ఉంటే మూడుపదులు ముప్పది. ఇట్లా తొమ్మిది ఉంటే తొంబది వరకు పోతుంది.

**౧౦౦**

నూర్లస్థానము ఇక్కడ ౧ నుంచి ౯ వరకు ఉండవచ్చును. నూరు, ఇన్నూరు, మున్నూరు ఇట్లా తొమ్మిది నూర్లవరకు పలుకుతుంది.

ఇది చూడండి.

**౧౧౧**

నూర్లస్థానములో ౧ ఉంది కాబట్టి ఒకనూరు.
పదులస్థానములో ౧ ఉంది కాబట్టి ఒకపది.
ఒకట్లస్థానములో ౧ ఉంది కాబట్టి ఒకటి.
అన్నీ చేరిస్తే నూటపదిపైన ఒకటి-నూటపదకొండు.

ఈ క్రిందివి చదవండి.

| | |
|---|---|
| ౨౩౪ | ౪౭౯ |
| ౬౭౬ | ౫౮౧ |
| ౮౯౯ | ౧౧౬ |

అంకెలస్థానాలలో ఎడమ కెడమకు వ్రాస్తూపోతే ఒకట్లు, పదులు, పదులకు పదులునూర్లు, నూర్లకు పదులు వేలు. ఇట్లా విలువ పెరుగుతూ పోతుంది.

చూడండి

| | |
|---|---|
| ౧ | ఒకటి |
| ౧ ౦ | పది |
| ౧ ౦ ౦ | నూరు |
| ౧ ౦ ౦ ౦ | వేయి |
| ౧ ౦ ౦ ౦ ౦ | పదివేలు |
| ౧ ౦ ౦ ౦ ౦ ౦ | లక్ష (నూరువేలకు పేరు) |
| ౧ ౦ ౦ ౦ ౦ ౦ ౦ | పదిలక్షలు |
| ౧ ౦ ౦ ౦ ౦ ౦ ౦ ౦ | కోటి (నూరులక్షలు) |

పైనచెప్పిన వన్నిటికిని ఇంగ్లీషుఅంకెలలో వ్రాసి అలవాటు చేయండి.

భారతి ముద్రాక్షరశాల, తెనాలి—౧౯౪౧/౧౦౦౦